కర్ఫ్యూ అమలు అనంతరం
గుల్బర్గాలో ప్రశాంత
పరిస్థితి

—2 వ పేజీ

ఆంధ్రపత్రిక

మాజీ గీతపనివారికి వృత్తి
కల్పించేందుకు గజానన్
తయారుచేసిన ప్రణాళిక

—4 వ పేజీ

318876

THE ANDHRA PATRIKA · MADRAS. సంపుటం 41. సంచిక 148 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO సోమవారం 30-8-1954 Reg. No.M. 1118 4 పేజీలు వెల 1 అణా.

# గోవా స్వాతంత్ర్యోద్యమంలో ఇప్పటికి 700 మంది అరెస్టు

## యూరప్ సైన్య పథకంపై ఫ్రాన్సు వైఖరి

### నిర్ణయం జాప్యంచేయరాదని ప్రధాని ప్రకటన

పారిస్, ఆగస్టు 28. యూరప్ సైన్య పథకం విషయంలో తనవైఖరి నిర్ణయించుకోటానికి ఫ్రాన్సు జాప్యం చేయరాదని ప్రధాని మెండీస్ ఫ్రాన్సు యీ రాత్రి రేడియోలో ప్రసంగిస్తూ అన్నారు.

ఆయన యీమాటలను పార్లమెంటు వచ్చేవారం యీవిషయమై ఓటు చేసి వేయాలేగాని, నిర్ణయం వాయిదా వేయరాదనే అర్థమయివుంటుందని అనుకొంటున్నారు.

పార్లమెంటులో ఈ ప్రధాన విషయమై చర్చ ఇవ్వాళే ప్రారంభమయింది. ఇదివరకు పోవలిస్టు ప్రభుత్వంలో రక్షణశాఖమంత్రిగా వుండిన జూల్స్ మోచ్ చర్చను ఉపక్రమిస్తూ పథకాన్ని తిరస్కరించాలన్నారు. యీ చర్చ నాలుగురోజులు జరుగుతుంది.

## కైరోలో కొట్లాటలు

కైరో, ఆగస్టు 28. ముస్లిం సహోదరత్వ సంస్థ నాయకుడొకడు నేడు ప్రభుత్వాన్ని దౌర్జన్యంతో ఎదిరించాలని ఒక మసీదుముందు చేరిన జనాన్ని ప్రబోధించాడు. దానితో ఈ నగర వీధుల్లో ఆ సంస్థ సభ్యులకూ పోలీసులకూ కొట్లాటలు జరిగాయి. 80 మందికి దెబ్బలు తగిలాయి. వీరిలో పోలీసులు కూడా చాలామంది వున్నారు. దరిమిలాను పోలీసులు 7 గురు నాయకులను అరెస్టు చేశారు.

## ఆగ్నేయాసియా రక్షణవ్యవస్థపై కామన్వెల్తులో అభిప్రాయ భేదాల నివారణ

### ముందుగా ప్రధానమంత్రుల పరిశీలన అవసరమని నైరోబీ సమావేశంలో సూచన

నైరోబీ, ఆగస్టు 28: ఆగ్నేయాసియా రక్షణ చర్చించటానికి కామన్వెల్తు రాజ్యాల ప్రధానమంత్రుల సమావేశం ఒకటి జరగటం అవసరం అని కామన్వెల్తు పార్లమెంటరీ సంఘ సభ ఆఖరి సమావేశంలో బ్రిటిషు ప్రతినిధి జేమ్స్ గ్రిఫిత్ సూచించారు. కామన్వెల్తు దేశాలు, తాము బలిష్ఠంగా వుంటూ, మూడవ ప్రపంచయుద్ధాన్ని నివారించే ఆశతో కమ్యూనిజంతో సహజీవనానికి ప్రయత్నించాలని ఆయన అన్నారు.

ఆగ్నేయాసియాలో ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక వ్యవస్థవంటిది దురాక్రమణ నిరోధకవ్యవస్థ నొకదానిని స్థాపించే విషయంలో కామన్వెల్తు చాలా ముఖ్యపాత్ర వహించాలని తమ అభిప్రాయమైనట్లు గ్రిఫిత్స్ అన్నారు. అట్టివ్యవస్థలో పాకిస్తాన్ చేరి ఇండియా, సిలోన్ చేరకపోయే టట్లయితే, కామన్వెల్తులో తీవ్రవిభేదాలు వచ్చే ప్రమాదమున్నదనీ, కనుక 'తిరుగులేని చర్య' ఏదీ తీసుకోకముందే దీనినిగురించి చర్చించేందుకు కామన్వెల్తు ప్రధానుల సమావేశం జరగాలని ఆయన అన్నారు.

పాకిస్తాన్ ప్రతినిధి ఎం. హెచ్. గజ్దార్ కూడా కమ్యూనిస్టు దురాక్రమణను నిరోధించేందుకు సమష్టి యత్నంపై సమాధానానికి వచ్చే నిమిత్తం కామన్వెల్తు ప్రధానుల సమావేశం జరగాలన్నారు. ఆగ్నేయాసియా రక్షణ సంప్రతింపులలో పాల్గొంటే ఎవరితోనూ చేరరాదనే తమవిధానాన్ని వదులుకొన్నట్లవుతుందని ఇండియా అని వున్నదనీ, మరో ప్రపంచవర్గాన్ని ఏర్పర్చాలని ఇండియా అభిమతమనీ ఆయన అన్నారు.

సిలోన్ ప్రతినిధి అలిపూహారే తమకు బ్రిటన్ నాయకత్వంలో నే నమ్మకమున్నదనీ, అదెంత గొప్పదైనా మరో దేశనాయకత్వాన్ని సిలోన్ అంగీకరింపదనీ అన్నారు.

### ఇండియా ప్రభృతదేశాలు పాల్గొనకపోతే వెలితి

పాకిస్తాన్ విదేశాంగమంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్, కరాచీలో మాట్లాడుతూ, మనీలా సమావేశంలో ఇండియా, సిలోన్, బర్మా ఇండోనీషియాలు పాల్గొనకపోతే, ఆ సమావేశ ఫలితంగా ఏర్పడే రక్షణ ఏర్పాటులో గానీ 'వెలితి' వుంటాయని అన్నారు. దురాక్రమణను పశ్చిమయూరపులో ఎదుర్కొన్నట్లు ఆగ్నేయాసియాలో ఎదుర్కోవటం కుదరదనీ, పశ్చిమయూరపు చాలామటుకు ఏకత్వం కలదనీ, ఆగ్నేయాసియా అనేక జాతులతో కూడినట్టిదనీ ఆయనన్నారు. యూరపులో సైనిక దురాక్రమణ ప్రమాదానికి ప్రతిగా ఐకమత్యం అవసరమనీ, ఆసియాలో అసలు దురాక్రమణకు ముందు చొరబాటు, విద్రోహం వుంటవనీ, వీటిని ఎక్కడికక్కడ ఎదుర్కోవాలనీ అంటూ, ఇక్కడ 'కమ్యూనిటీ ఇంపీరియలిజా'న్ని ఎదుర్కొనేందుకు ఆర్థికంగానూ, సైనికంగానూ కూడా బందోబస్తు అవసరమనీ, ఇది వర్థిల్లే పరిస్థితులను తొలగించాలనీ ఆయనన్నారు.

### ఫార్మోజాను కూడా కలుపుకోవాలట

ఆ. ఆ. ర. వ్య. అనేదానికి సంబంధించిన 'ఐచ్ఛిక లేదా సాన్నిహిత్య' రక్షణ ప్రాంతంలో ఫార్మోజాను కూడా చేర్చాలనే విషయమై ఫిలిప్పీన్స్ అధ్యక్షుడు దామన్ మాగ్సేసే, ప్రభుత్వ నాయకులూ ఏకాభిప్రాయానికి వచ్చారని అభిజ్ఞవర్గాలద్వారా తెలిసింది. 'ఐచ్ఛిక లేక సాన్నిహిత్య' ప్రాంతం అంటే, సీటో రాజ్యాలు సంప్రతింపుద్వారా రక్షింపవలసిన ప్రాంతమని వారు నిర్వచించారు.

సమావేశంలో ఫిలిప్పీన్స్ చేసే ప్రతిపాదనలలో కూడిన ఒక ఒడంబడిక ముసాయిదాను వీరు నేడు ఆమోదించారట. ఫార్మోజా విషయంలో వీరి సూచన బ్రిటను అభిప్రాయానికి అనుగుణంగా ఉన్నదనీ అమెరికా యేమో ఫార్మోజాను 'తప్పనిసరి' ప్రాంతాలలో నే, అంటే దానిపై ముట్టడి జరిగితే మిగతా అన్నిరాజ్యాలపైనా జరిగినట్లు

(3 వ పేజీ చూడుడు)

## జెయిళ్లు నిండిపోగ పిచ్చిఆస్పత్రులు కారాగారాలుగ మార్పు

### సత్యాగ్రహులపై పోర్చుగల్ పోలీసుల రాక్షస చర్యలు

బెల్గాం, అగస్టు 29: దత్తారాం దేశాయి నాయకత్వాన మొన్న గురువారంనాడు గోవాలో సత్యాగ్రహం జరుపబోయిన 10 మంది వలంటీర్లనూ నిన్న సాయంత్రం పోలీసులు పాండావద్ద అరెస్టుచేసి రాజధాని పాంజిలకు తీసుకుపోయారని తెలుస్తోంది. వీరిలో 9 మంది వలంటీర్లు క్రైస్తవులు.

పాంజిలకు తీసుకువెళ్ళేటప్పుడు, వలంటీర్ల నోళ్ళలో గుడ్డలుకుక్కి, వాళ్ళ ముఖాలు గుర్తు తెలియకుండా గుడ్డలు వేసి కట్టారట, ఠాణాలో వారిని చిత్తం వచ్చినట్లు కొట్టి హింసించారట.

గత రెండు వారాలలోనూ గోవాలో మొత్తం ఏడువందలమంది అరెస్టు అయినట్లు ఇక్కడికి వార్తలు వచ్చాయి. వీళ్ళందరినీ ఉంచడంకోసం గోవాలోని పిచ్చాసుపత్రులనుకూడా ఖైదుడుగామార్చి, చుట్టూ ముళ్ళకంచెలు కంచెవేస్తున్నారట ఖైదీలను, "ఇంక ఉద్యమంలో చేరను" అని గోలపెట్టేవరకూ పశువులను బాదినట్లు బాది హింసిస్తున్నారట.

ఇలాఉండగా అజ్ఞాత వాసంలో ఉన్న సత్యాగ్రహులగురించి వార్తలు తేవడానికి గోవా అధికారులు గూఢచారులని పంపుతున్నారు. ఈపద్ధతిలో గోవా సరిహద్దు ప్రాంతానఉన్న భారతీయ పట్టణాలకువచ్చి తిరుగుతున్న ఐదుగురు గోవా గూఢచారులను భారత పోలీసులు అరెస్టుచేశారు.

గోవావిమోచన ఉద్యమం విస్తరించి బలవత్తరమవుతున్న కొద్దీ, గోవా అధికారుల దౌర్జన్యకాండ మితిమీరిపోతున్నదట. ఉద్యమంలో ఏఒక్కరికైనా ఏమాత్రమైన ప్రమేయం ఉన్నట్లు అనుమానం తగిలితేచాలు. పోలీసులు వాళ్లని చిత్తంవచ్చినట్లు కొరడాలూ లాఠీలూ పెట్టి, కొట్టి హింసిస్తున్నారట. ఎలక్ట్రిక్ వైర్లతో షాకులిచ్చి, నానాహింస పెట్టి, ఉద్యమంతో మాకు సంబంధంలేదు మొర్రో అని వాళ్లు గోలపెట్టేవరకూ హింసిస్తున్నారట.

గోవానుండి వచ్చిన ఒక జాతీయ కాంగ్రెసు సభ్యుడు ఇదంతా కళ్లారా చూచి వచ్చి చెప్పాడు.

గోవాఅంతా ఇప్పుడు ఒకయుద్ధఖైదీలను ఉంచే సైనిక శిబిరం వలె ఉన్నదని ఆయన చెప్పారు. జనం బయట తిరగడానికే భయపడుతున్నారట. ప్రతిరాత్రి 12 గంటలయేసరికి, హింసాకాండ ప్రారంభం అవుతుందట. ఆ పోలీసు దౌర్జన్యాలకు గురిఅవుతున్న వాళ్ళ ఆక్రందనకు, ఇళ్లలో నిద్రిస్తున్నవారు కూడా లేచిపోయి, ఆందోళన చెందుతున్నారట.

సాయంత్రం కొంచెం చీకటి పడితే గోడ్డువీధులనిషిద్ధాజ్ఞ జారీచేసినట్లు సమాచారం.

మరికొన్ని వార్తలు 3 వ పేజీలో

## కొరియా అంతటా అధికారం తమదేనట

### దక్షిణ కొరియా ప్రధాని అభిభాషణ

సియోల్, ఆగస్టు 28. ఉత్తరం దక్షిణం అనే భేదం ఏమీ లేకుండా కొరియా అంతటా సర్వతంత్ర అధికారం తమదేనని దక్షిణకొరియా ప్రధాని ప్యున్‌యుంగ్‌తై ఇవ్వాళ అన్నారు. 38-వ అక్షాంశరేఖకు ఉత్తరానగల 2800 చ. మైళ్లు ప్రాంతంమీద సర్వతంత్రాధికారం విషయంలో న్యాయశాస్త్ర విహితమయిన పరిస్థితి ఏమిటని అడగ్గా ఆయన యీ మాట అన్నారు.

నిరుడు యుద్ధ విరమణసంధి జరిగినప్పుడు యీ ప్రాంతం సమితి అజమాయిషీ కిందికి వచ్చింది. ఈ మాసంలో సమితి సైనికాధికారవర్గం ఆ ప్రాంత పరిపాలనా అజమాయిషీని దక్షిణకొరియాకు అప్పగించారు. ప్రాదేశిక సర్వతంత్రాధికార సమస్యను మాత్రం తేల్చకుండా వదలిపెట్టారు.

## "సంలగ్నవేల యుద్ధఖైదీల జాడ తెలియడంలేదు"

### ఇండో-చైనా యుద్ధఖైదీల పరటా సంఘంలో ఫ్రెంచివర్గాల ప్రకటన

లండన్, ఆగస్టు 28: యుద్ధఖైదీల పరటాలకు సంబంధించిన షరతులను ఫ్రాన్సు ఉల్లంఘిస్తోందని ఇండోచైనా యుద్ధవిరమణ సమష్టి కేంద్ర సంఘంలోని వియత్మిన్ ప్రతినిధివర్గ నాయకుడు జనరల్ వాన్‌తీన్‌డంగ్ ఆరోపించినట్లు వియత్మిన్ వార్తాసంస్థ నేడు ప్రకటించింది. జనరల్ వాన్ ఈ నెల 25న ఫ్రెంచి ప్రతినిధివర్గ నాయకునికి ఉత్తరం వ్రాస్తూ రోజూ అప్పగించవలసిన వారి నందరినీ అప్పగించటంలేదని ఫిర్యాదు చేశారట.

ఇదిట్లా వుండగా, అటు ఫ్రెంచి సైనికాధిష్ఠానవర్గంవారేమో, తమ తాలూకు సైనికులు 40,712 మంది జాడ తెలియకుండాపోగా, వియత్మిన్లు తమఆధీనంలో 9138 మంది మాత్రమే వున్నట్లు తెలిపారనీ మిగతావారిగతేమైందో తెలియటంలేదని ఆందోళన వెల్లడిస్తున్నారు. వియత్మిను తమవద్ద నున్నట్లు చెప్పినవారిలో 2714 మందిని మాత్రం ఉత్తర ఇండోచైనాలోనూ, మరికొన్ని వందలమందిని మధ్య దక్షిణ ప్రాంతాలలోనూ మొన్న బుధవారంనాటికి వాపసుపంపారనీ, ఆ రోజుకు ఫ్రెంచివారు 20,616 మంది వియత్మిన్లను వాపస్ పంపారనీ వారు తెలిపారు. ఫ్రెంచి సైనికులు విశేషంగా హతులైనాకూడా వియత్మిన్లవశంలో వున్న వారి సంఖ్య వారు తెలిపినదానికంటే చాలా ఎక్కువ అయివుండాలని వారన్నారు.

ఈ యుద్ధ విరమణ ఒప్పందం అనుటను పర్యవేక్షిస్తున్న ఇండియా, కెనడా, పోలెండు దేశాల సమష్టి సంఘంవారు ఈ ఖైదీల పరటా విన్నపసు ముగియవలసివున్నదనీ, కనుక తొందరగా పూర్తిచేయవలసిందనీ ఉభయపక్షాలనూ విన్నవించింది. వచ్చే మంగళవారం లేదా గురువారం దాటకుండా ఇది ముగించాలని కోరింది.

## పరియా ప్రభుత్వాన్ని పడగొట్టే కుట్ర

లండన్, ఆగస్టు 29: ప్రస్తుత పరిస్థితుల ప్రభుత్వాన్ని పడగొట్టేందుకు పోలీసు, సైన్యము కుట్ర చేసినదనీ, ఆ కుట్రను అణచివేసేందుకు ప్రధాని ఫ్లోరా జంపేడ్ అమాంతంగా అరెస్టులు జరిపించారనీ, టెహరానులో నే 250 మందిని అరెస్టుచేశారనీ కైరో రేడియో గతరాత్రి ప్రకటించింది.

## విజయవాడ స్టేషన్ అభివృద్ధి పథకం

### సొమ్ము మంజూరు: త్వరలో నే పని ప్రారంభం

విజయవాడ, ఆగస్టు 27. 98 లక్షల రూ.ల ఖర్చుతో విజయవాడ రైల్వే స్టేషను అభివృద్ధికిగాను తయారుచేయబడిన పథకం అతి త్వరలో నే అమలు జరుపబడగలదని దక్షిణ రైల్వే జనరలు మేనేజరు శ్రీ టి. ఏ. జోసఫ్ గారు ఈ సాయంత్రం పత్రికా ప్రతినిధులతో చెప్పారు. ఇందుకు కావలసిన సొమ్ము మంజూరు చేయబడిందని, యీ అభివృద్ధికి కావలసిన స్థలం స్వాధీనం చేసుకొనుటకు చర్యలు తీసుకొనబడుతున్నవనికూడ వారు చెప్పారు. స్వ. వి.

## కృష్ణలో నీరు తగ్గితే నవంబర్లో తిరిగి రెగ్యులేటర్ పని ప్రారంభం

### ఈ ఏడాది చాలా సమస్యల్ని ఎదుర్కోవాల్సి వున్నదని ఇంజనీర్ల అభిప్రాయం

("ఆంధ్రపత్రిక" విలేఖరి)

విజయవాడ, ఆగస్టు 27: కృష్ణా బారేజ్ పని ఈయేడు తిరిగి నవంబరు నెలలో—అప్పటికి నదిలో నీరు తగ్గిపోతే— మరల ప్రారంభం కాగలదని తెలుస్తున్నది.

ఈ సంవత్సరం నిర్మాణంలో చాల చిక్కులు ఎదుర్కొనవలసి వస్తుందని యింజనీర్లు భావిస్తున్నారు. ఈ యేడు డెల్టాలో రెండవ పంటకు — గత సంవత్సరంకంటె ఎక్కువ ఆయకట్టుకు—నీరు యివ్వాలని నిర్ణయం జరిగినట్లు తెలుస్తున్నది. అంటే నదిలో ఆనకట్టపై కనీసం 4 అడుగుల నీటిమట్టం వుంచాల్సి వుంటుందట.

ఇక పాత సీతానగరం దగ్గర కృష్ణా పశ్చిమడెల్టా హెడ్ యిన్ కాల్వపై ఒక వంతెన నిర్మించవలసి వుంది. ప్రస్తుత కార్యక్రమం ప్రకారం యీ నిర్మాణం 1956 జనవరిలో ప్రారంభమవుతుంది. ఇందుకు టెండర్లు పిలవటం జరిగింది. యీ నిర్మాణంలో గూడ కాలవ్యవధి నూతను మూసా లు మాత్రమే. డెల్టా రెండవపంటకు నీరు సరఫరా చేస్తూ, యీ కాల్వపై బ్రిడ్జినిర్మాణం జరగాలి. ఇందుకు యింజనీర్లు తగిన సన్నాహాలు చేస్తున్నారు.

బారేజ్ నుంచి యీ బ్రిడ్జి వరకు జాతీయ రహదారిలో భాగంగా కొంచెప్రక్కగా రోడ్డునిర్మాణం దాదాపు పూర్తికావచ్చింది. కొంచెప్రక్కగా బల్ డోజర్లతో మట్టం చేయబడింది. మరల ఏప్రిలునాటికి యీ కొత్తరోడ్డు మీదుగా రాకపోకలు సాగించుటకు వీలుగా యీ బ్రిడ్జిపని చాల చురుకుగా జరగాలని యింజనీర్లు కృషి చేస్తున్నారు.

## జగాన్ సతిక జుల్మానా

జార్జిటౌన్, ఆగస్టు 28. గతి డిసెంబరులో అక్రమ సభ జరిపిన నేరానికి శ్రీమతి జానెట్ జగాన్‌కు విధించిన 65 డాలర్ల జుల్మానాను వసూలు చేయటానికి అప్పీలు కోర్టువారు నిర్ణయించారు.

## 'శాంతిసాధనకు యుద్ధం'

### భారతదేశానికి విశ్వాసం లేదని కృష్ణమీనన్ ఉద్ఘాటన

న్యూఢిల్లీ, ఆగస్టు 28: "శాంతిసాధనకు యుద్ధం అవసరమని భారతదేశం భావించటంలేదు. శాంతిప్రధాన సమైక్యంగా పురోగమించుటద్వారానే ఇతోధిక సుఖసంతోషాలు పొందగలమని భారతదేశం భావిస్తున్నది" అని సమితిలో భారత ప్రతినిధివర్గ నాయకుడు శ్రీ వి. కె. కృష్ణమీనన్ గత రాత్రి ఐక్యరాజ్యసమితి విద్యార్థిసంఘ (ఇండియాశాఖ)వారి విందులో ప్రసంగిస్తూ అన్నారు.

ఈ సందర్భంలో వారింకా యిలా అన్నారు:

"సహజీవనానికి ప్రత్యామ్నాయం పరస్పరం నాశనం చేసుకోవటమే. రాజకీయ, సాంఘిక, విషయాలలో సమానభావం ప్రదర్శించలేని దేశంగాని సంఘంగాని ప్రపంచశాంతికి దోహదమివ్వలేదు. 'సహజీవనం' అన్న పదం యీ రోజుల్లో ఫ్యాషన్ అయిపోయింది. దాని అర్థం చెప్పడానికి బహు కొద్దిమందే ప్రయత్నించారు. ఇది చిక్కు పదమేకాంతెం. అసలు సహజీవనానికి ప్రత్యామ్నాయం వేరే ఏమున్నది? మానవత్వపు విలువలపట్ల గౌరవం చూపకుండా, విదేశాల విమర్శలను సహించకుండా వుండేదేశాలు సహజీవనానికి నిజంగా ఏమాత్రం తోడ్పడలేవు. ఇండోచైనాలో యుద్ధవిరమణ జరిగింది. కొరియాలో సంవత్సరన్నర నుంచి కాల్పులు జరగలేదు. అయినా యుద్ధం ప్రచ్ఛన్నంగా జరుగుతూనే వుంది. అంటే వుద్రిక్తత, యుద్ధసన్నాహాలు జరుగుతున్నాయన్న మాట. ప్రపంచం రెండు యుద్ధకూటాలుగా చీలిపోయే ప్రమాదం ఏర్పడుతున్నది. ఎవరికివారు శాంతిస్థాపకులమని అంటూ ఇతరులను భయపెడుతున్నారు.

ఎక్కడైతే ఇతరులపై ఆధిపత్యం సాగుతున్నదో, ఒక జాతిపై మరొక జాతి లేక సంస్కృతిపై మరొక సంస్కృతి ఆధిపత్యం చెలాయిస్తూ స్వేచ్ఛాప్రకటనలకు తావులేకుండ చేస్తున్నదో అక్కడ యుద్ధవాతావరణం నెలకొనివున్నదని చెప్పవచ్చు.

భారతదేశం ఆర్థికస్థితి కొంచెం పరిమితంగావున్నా తను షైకిరావాలన్న కాంక్షతో గాక, చిక్కు సమయాల్లో కూడ శాంతిస్థాపనకు కృషి చేస్తున్నది.

ప్రాక్పశ్చిమదేశాలలో మన విధానాలని విమర్శిస్తూ 'ఎటూ మొగ్గనివాళ్లనీ, ముళ్లకంచెమీద కూర్చుంటున్నామనీ, ఒక విధానమంటూలేదనీ' ఆరోపణలు చేసేవాళ్లున్నారు. కాని వా మున్నకు మాత్రం 'మనం మనతరఫే మాట్లాడుతున్నామని, ఇతరులను వ్యతిరేకించడమే మన పనిగాదనీ' తోస్తున్నది."

## భారతదేశంలో ఫ్రెంచి స్థావరాల బదిలీ

### ఫ్రాన్సు ప్రధానితో కృష్ణమీనన్ చర్చించే సూచన

బొంబాయి, ఆగస్టు 29: సమితి సాధారణసభలో భారత ప్రతినిధివర్గానికి నాయకత్వం వహించే వి. కె. కృష్ణమీనన్ ఇవ్వాళ ఇక్కడనుంచి బయలుదేరనున్నారు. గతరాత్రే యీయన ఢిల్లీనుంచి ఇక్కడికి వచ్చారు.

లండన్‌నుంచి పారిస్ వెళ్ళినప్పుడు మీనన్ బహుశా ఫ్రెంచిండియా స్థావరాల బదిలీనుగురించి ఫ్రాన్సు ప్రధానితో చర్చించవచ్చునని అనుకుంటున్నారు.

## అమెరికా భారత దేశాల సఖ్యత

### రాయబారి ఎలెన్ అభిప్రాయం

వాషింగ్టన్, ఆగస్టు 28: భారత అమెరికా దేశాలమధ్య స్నేహ బంధాలు ఉండవలసిన తీరుగాలేవు అని అమెరికన్ ప్రాంత జాతీయ రక్షణ సంఘంతో మాట్లాడుతూ భారతదేశంలోని అమెరికన్ రాయబారి జార్జియాలెన్ అన్నారు. అందుకు అవరోధాలుగా ఉన్నవాటిని వివరిస్తూ అయన పోరాటంలో పాల్గొనలేదనే కారణం వలన జెనీవాలోని కొరియా శాంతి సమ్మేళనంలో భారతదేశాన్ని పాల్గొననీయక పోవటం, పసిఫిక్‌లో అణు ఉదజని శక్తి ప్రయోగాలు చేయటం, కమ్యూనిస్టు చైనాను గుర్తించక పోవటం, పాకిస్తానుకు మిలిటరీ సహాయం చేయటంఅనే నాలుగు అంశాలని ఆయన పేర్కొన్నారు అయితే భారతదేశానికి ఆర్థిక సహాయం చేయటంలో అమెరికా ఉదారంగా ప్రవర్తించింది అని కూడా ఆయన చెప్పారు. భారతదేశం రష్యాకూటమిలో పడిపోలేదు స్వేచ్ఛ ప్రపంచంలో అది పెద్ద ప్రజాస్వామిక దేశం అని కూడా యీ లెన్ చెప్పారు.

## వరదలవల్ల అస్సాం, బీహార్ బెంగాల్‌లో 189 మంది మరణం

### జలమయమైనప్రాంతాల్లో కిద్వాయ్ పర్యటన మరికొన్ని ప్రాంతాలకు వరద ప్రమాదం

కలకత్తా, ఆగస్టు 28. ఉత్తరబీహారు వరదపీడిత ప్రాంతాలనుచూచి పరిస్థితిని పరిశీలించేటందుకు ప్రధాని నెహ్రూ సెప్టెంబరు 4వ తేదీన పాట్నా రానున్నట్లు తెలుస్తున్నది.

బీహారు, అస్సాం తూర్పుపాకిస్థానులలో పరిస్థితులు ఇంకా విషమించివుండి. ఉత్తరబెంగాలు జిల్లాలలో మాత్రం వరదనీరు తగ్గుతున్నది.

కోశీనదిలో ఇటీవలవచ్చిన వరద జూలైలో వచ్చిన పెద్దవరదకన్నా మించిపోయింది. జాడ తెలియ లేదనుకున్న 125 మంది మరణించి ఉంటారని పశ్చిమబెంగాలుప్రభుత్వం ప్రకటించింది. మొత్తం మరణించినవారి సంఖ్య దీనితో 189 మంది.

బ్రహ్మపుత్రానది జిల్లాల ఇప్పుడు తూర్పుబెంగాలు, అస్సాం సరిహద్దున ఉన్న ధుబ్రీనిలె కింది దిబ్రుఘర్‌లో వరదనీరు తగ్గిపోయినా కొన్ని ప్రాంతాలు కట్టుతున్నవి.

ఉద్ధృత బ్రహ్మపుత్ర ప్రవాహం చివరివెల్లువ రంగపూర్ జిల్లాకి తగిలిందని, మొదటివెల్లువ తిప్పెరా, నౌఖాలీ జిల్లాలకు తాకిందనీ ముక్కోవార్తలు తెల్పుతున్నవి.

145 మంది అమెరికన్ సైనికోద్యోగులు తూర్పుబెంగాలులు అంటువ్యాధి నిరోధక కార్యక్రమంలో, నిమగ్నులయివారు. కొరియానుంచి రెండు అమెరికన్ హెలికాప్టర్లు కూడా వచ్చి అక్కడపనిచేస్తున్నాయి.

ఈ వరదలవలన, ఒక్క గౌహతి దేశంలోనే రైల్వేమొదలయిన కేంద్రప్రభుత్వ ఆస్తులకుమాత్రం అటుంచి, వీర్ల కోట్ల రూపాయల నష్టము ఉంటుంది.

జల్‌పాయ్‌గురి, కూచ్ బీహార్ జిల్లాలలో ఆహార పదార్థాలు హాశిమారా విమానదళంనుండి విమానాలనుంచి కిందికి విసురుతున్నారు. సిల్‌గురివద్ద రైలుమార్గం కొట్టుకుపోవటం వల్లను, అక్కడికిప్పుడు విమానాలు చెన్నమయ్యాయి. అక్కడనుంచి విమానాలు తిరుగుపోతున్నాయి.

జులైలో పొంగవుండా ఉన్న కోశీ, కమలా, గంగానదులు ఇప్పుడు ఇంకా పొంగుతున్నాయి. దర్భంగాలో కొన్నిచోట్ల మాత్రం కోశీ తగ్గుముఖం పట్టింది.

### ఉత్తర బీహారు పరిస్థితి

పాట్నా, ఆగస్టు 28: ఉత్తర బీహారు వరదలేవీ యింతవరకు తగ్గుముఖంపట్టలేదు.

ప్రవాహం దర్భంగా జిల్లాలోని రెండు గ్రామాలపై గంగానది కట్టలు తెంచుకుపడింది. ఉత్తర బీహారులో గత జూలై మాసంలో మునిగిపోయిన 12,000 చదరపు మైళ్ల ప్రాంతం మళ్లీ జలమయమైంది. దుఃఖం, ఆకలి, ఆము యం అక్కడ ప్రళయనృత్యం చేస్తున్నది. గోడలపై బొమ్మబంటి నీరు విలిచియున్నది.

### వరద ప్రాంతాలలో కిద్వాయి పర్యటన

భారత ఆహార మంత్రి కిద్వాయి, బీహార్ ఆరోగ్యశాఖామంత్రి పండిట్ హరినాధ్ మిశ్రా నేటి ఉదయం విమానంలో ఈ ప్రాంతాలను చూచివచ్చారు. పూర్ణియానుండి దర్భంగావరకు కనుచూపుమేర అయిదుమైళ్ల వెడల్పున ప్రాంతం, సముద్రం తిరలివచ్చినట్లున్నది.

శ్రీ కిద్వాయ్ దర్భంగానుండి, తామువిమానంపై 40 మైళ్లు ప్రయాణించారు. ఆ మార్గానికి ఇరుప్రక్కలా వరదనీరు నిలిచియున్నది. గ్రామస్తులు తమ పశువులతో సహా ఆ గోడ కట్టడంపై నిక్కుమిక్కుమంటూ కూర్చున్నారు. కొన్ని గ్రామంలో అంతిమముందే ఒకరు మునిగిపోయారనీ, అలా అంతిమవ అయిదుగురు మరణించారనీ ఆయనకు చెప్పారు.

శ్రీ కిద్వాయ్ తాముదిగినచోటి వసతిపై గ్రామానికి వచ్చి, వారి నీటి సమస్యలని విచారించారు. వరద ప్రాంతాల పరిశీలన తరువాత కేవలం పెన్నిధి సహాయ కాలనీ చూసి ఆయన ఆ ప్రాంతాలను పర్యవేక్షణ పరిశీలించవలసిందిగా

(3 వ పేజీ చూడుడు)

## జంతుహింసా నిరోధక కార్యక్రమాల పరిశీలన

### శ్రీ కృష్ణమీనన్ అధ్యక్షతను ప్రత్యేక సంఘ నియామకం

న్యూఢిల్లీ, ఆగస్టు 28: దేశంలో జంతుహింసా నిరోధానికి సంబంధించిన ప్రస్తుత పరిస్థితిని సమగ్రంగా విచారణ చేయటానికి శ్రీ వి. కె. కృష్ణమీనన్ అధ్యక్షతన ఒకసంఘాన్ని భారత ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

జంతుహింసా నిరోధ సమస్యకు సంబంధించిన అన్ని అంశాలను ఈ సంఘం పరిశీలిస్తుంది. ఇందుకు సంబంధించిన శాసనాన్ని ప్రధానంగా పరిశీలించి, అమలు పద్ధతులలోగల శాస్త్రీయ పరిపాలనా ఇబ్బందులను గురించి కూడా ఆలోచిస్తుంది. ఇతర నాగరిక దేశాలలో గల ఇటువంటి శాసనాలను పరిశీలించి, 'అంగోన్నతి' అనేపదాన్ని స్పష్టంగా నిర్వచిస్తుంది.

1953 జంతుహింస నిరోధకబిల్లుపై 1954 మార్చి 6వ తేదీన రాజ్యసభలో జరిగిన చర్చ సందర్భంగా భారత ప్రభుత్వం ఒకసంఘాన్ని నియమిస్తానని ప్రకటించింది.

ఈ సంఘంలో శ్రీమతి రుక్మిణీ అరండేల్, డాక్టర్ ఎస్. డి. గిల్‌డర్, కాకా కలేల్కర్, ప్రొఫెసర్ ఎస్. ఆర్. మల్కాని, శ్రీమతి లక్ష్మీమీనన్, డి. జి. తెండూల్కర్, డాక్టర్ సయ్యద్ మహమ్మద్, జె. శ్రీనివాసమూర్తి, భారత ప్రభుత్వ జంతుసంపదశాఖ కమీషనర్ పి. ఎన్. నందా, భారతప్రభుత్వ ఫారెస్టుల ఇన్‌స్పెక్టర్ జెనరల్ సి. ఆర్. రంగనాథన్, భారతప్రభుత్వ ఆరోగ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్ జెనరల్ డాక్టరు కె. ఎల్. ఐస్త్రీ, కేంద్ర ఆహార, వ్యవసాయ శాఖ డిప్యూటీ కార్యదర్శి ఆర్. ఎల్. మెహతా గారలు ఉన్నారు. శ్రీ మెహతా ఈ సంఘానికి కార్యదర్శిగా వ్యవహరిస్తారు.

## దేశంలో ఆహార పరిస్థితి

### 'వరదలవల్ల దెబ్బతినదు' ఆహార మంత్రి కిద్వాయ్ ప్రకటన

కలకత్తా, ఆగస్టు 29: "దేశంలో ఈసారి వరదలు తెచ్చిపెట్టిన విధ్వంసం ఫలితంగా ఆహార పరిస్థితి ఏమాత్రం దెబ్బతినదనీ తిరిగి కంట్రోళ్లు అమలు జరపవలసిన అవసరం ఏర్పడదనీ కేంద్ర ఆహారశాఖ మంత్రి రఫీ అహమద్ కిద్వాయి నేడు విలేఖరుల ప్రశ్నకి జవాబు చెప్పారు.

ఉత్తర బీహారులో వరదప్రాంతాలను చూచి నేడే ఆయన కలకత్తాకు వచ్చారు.

వరదబాధితులకు బీహార్ రాష్ట్ర ప్రభుత్వం ఖర్చుపెట్టే మొత్తంలో కేంద్రం సగం భరిస్తుందని కిద్వాయి తెలియచేశారు.

## మనీలాకు అమెరికా ఉన్నతాధికారుల ప్రయాణం

వాషింగ్టన్, ఆగస్టు 29: అమెరికా ప్రభుత్వ ఉన్నతాధికారులు కొందరు నేడు ఇక్కడనుండి మనీలాకు విమానంలో బయలుదేరి వెళ్లారు. ఆగ్నేయ ఆసియా రక్షణ వ్యవస్థపై చర్చించటానికి మనీలా (ఫిలిప్పీన్స్)లో సెప్టెంబరు 6న అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన దేశాలు సమావేశం కాబోతున్నవనే విషయం పాఠకులకు విదితమే.

శ్రీ లియాయ్ తమురిజప్తిలో ఈనామ్ వాములనుంచి తొలగించకుండా రక్షణ కలిగించాలనిమంత్రిమే రైతులు కోరుతున్నారన్నారు. యీ ఆందోళనను కొనసాగిస్తున్న ప్రజాసోషలిస్టు పార్టీ పూర్తిగా ఈనామ్ గ్రామాలకూ, కంట్రాక్టులకూ, శివాయిజమాయీదారులకూ రక్షణ కలుగచెయ్యాలని కోరింది. 1947 నుంచి ఈనామ్ రైతులకు రక్షణ కలిగించాలని కూడా పార్టీ కోరింది.

## మరి 12 మంది అరెస్టు

కర్నూలు, ఆగస్టు 28: ప్రజాసోషలిస్టువారు ప్రారంభించిన యీనామ్ సత్యాగ్రహం సందర్భంలో ఈ పళ్ళ మంది అరెస్టుచేసి సందికొట్టూరు తీసుకువెళ్ళారు. దీనితో యీ సత్యాగ్రహంలో ఇంతవరకు మొత్తం 137 మంది అరెస్టయారు. (పి. టి. ఐ.)

## ప్రభుత్వ ఉత్తరువులు

కర్నూలు, ఆగస్టు 27: గుంటూరు జిల్లా గూడిపల్లి పంచాయతీకి కొంతకాలం వినియోగించి పనిచేసే ఎగ్జిక్యూటివ్ ఆఫీసరును నియమించాలని ప్రభుత్వం ఉత్తరువులు ఇచ్చింది.

* * *

ప్రస్తుతం మద్రాసులో వుంటున్న ఆంధ్రప్రభుత్వ పరీక్షల కమీషనరు కార్యాలయం ఆగస్టు 23 వ తేదీనుంచి మద్రాసులోని మౌబ్రేస్ రోడ్డు (తేనాంపేట-మద్రాసు 18) లోకి మార్చబడింది.

* * *

విజయవాడలోని కన్యకాపరమేశ్వరీ వేరుశనగ నూనెమిల్లు కంట్రాక్టర్లకూ, సాంకేతిక పనివారికీ వచ్చిన వివాదాన్ని విశాఖపట్టణం పారిశ్రామిక వివాదాల ట్రిబ్యునలుకు ప్రభుత్వం పంపించింది.

* * *

ఉపాధ్యాయుల వేతనాలలోనుంచి రూ. 123-4-0 లను దుర్వినియోగం చేశాడన్న నేరానికిగాను అనంతపురం జిల్లా కదిరితాలూకా కోకంటి గ్రామంలోని బోర్డు ప్రాథమికపాఠశాల ప్రధానోపాధ్యాయుడుగా పనిచేసిన ఎస్. రామదాస్ రెడ్డిగారికి అనంతపురం సబ్ డివిజనల్ మేజస్ట్రేట్ రెండు నెలల శిక్ష విధించారు. రామదాస్ రెడ్డిగారిని ఉద్యోగంనుంచి బర్తరఫ్ చేశారు.

* * *

అనంతపురంజిల్లా ఉరవకొండ పంచాయతీకి జిల్లా మున్సిపాలిటీల చట్టంలోని కొన్ని నిబంధనలు వర్తింప చేయబడినవి.

# గీతపనివారికి వృత్తి కల్పించే ప్రణాళిక

## సాలీనా లక్ష రూపాయల ఖర్చు

### శ్రీ గజానన్ నాయక్ పథకం వివరాలు

మద్రాసు, ఆగస్టు 27: ఆంధ్రదేశంలో గీతపనివారి సమస్యను పరిష్కరించడానికి రాష్ట్రంలో ఉత్పత్తి శిక్షణకేంద్రాల స్థాపన, తాటిబెల్లం, పంచదార ఉత్పత్తిని గురించి తాము సూచించే ప్రణాళిక సందర్భంలో ఆంధ్రప్రభుత్వం తీసుకునే సమర్థమైన సొష్ఠవమైన చర్యలపై దాని జయం ఆధారపడుతుందనీ, తమ ప్రణాళిక అమలుకు యీసాలుకు రు. 1,06,827 లు ఖర్చుకాగలదనీ, అందు సాలీనా అయ్యేఖర్చు రు. 70,827/-ఒకే సారి పెట్టుఖర్చు రు. 6,000/-వ్యాపార పెట్టుబడికింద రు. 30 వేలు అవుతుందనీ, అందువల్ల ప్రభుత్వం దాదాపు యీలక్షరూపాయలు మంజూరుచేయాలనీ భారతప్రభుత్వ తాటిబెల్లం పరిశ్రమ సలహాదారు శ్రీ గజానన్ నాయక్ గారు ఆంధ్రప్రభుత్వానికి తమ ప్రణాళికలో సూచించారు. ఇందు ప్రభుత్వం పెట్టిన ఖర్చులో 50% కేంద్రప్రభుత్వము ఇవ్వగలదనీ, ప్రభుత్వం ఈ ప్రణాళికను త్వరగా పరిశీలించి మంజూరుచేసి అ. భా. ఖాదీ గ్రామపరిశ్రమల బోర్డుకు పంపించాలనీ కోరారు.

ఈప్రణాళిక జయం కావాలంటే ప్రభుత్వం సత్వరంగా సొష్ఠవమైన, సమర్థమైన చర్యతీసుకొని నిరాలస్యముగా పనిచేయాలనీ సాంకేతిక సిబ్బందిని సహకారశాఖనుంచి అభివృద్ధి శాఖకు మార్చాలనీ, నిత్య వ్యాపార వ్యవహారాలకు అవసరమైన ధనాన్ని మంజూరుచేయాలని సూచించారు. తాము సూచించిన ప్రణాళిక అమలు జరిపితే రాష్ట్రమంతటా నీరా ప్రచారము, నీరానుంచి తయారయ్యేపదార్థాల వాడకము హెచ్చుకాగలదని తెలియజేశారు.

శ్రీ నాయక్ గారు తమ ప్రణాళికలో ఇల్లా సూచించారు. "ఆంధ్రదేశములో తాటిబెల్లం పరిశ్రమ స్థిరంగా నెలకొని ఉన్నది. పాలు అమ్మేవాడు గ్రామాల్లో పాలకు అలవాటుపడినట్లు తాటిబెల్లం తయారుచేసేవారు నిత్యాహారానికి నీరాపానం అనుపానంగా అలవాటుపడ్డారు. సంపూర్ణ మద్యనిషేధం రాకపూర్వంనుంచీ ఆంధ్రదేశంలో తరతరాలుగా గ్రామీణులు తాటి, ఈతచెట్లుగీసి బెల్లాన్ని తయారుచేసేవారు. మద్యనిషేధంవల్ల వృత్తి పడిపోయిన వేలాది గీతవారికి, తాటిబెల్లం, నీరా, గీత జీవనాధారాన్ని బాగా కల్పిస్తోంది. ఐతే తాటిబెల్లం తయారుకు కొన్ని చోట్ల తాటిచెట్లను గీయటానికి గీతపనివారికిచ్చిన స్వేచ్ఛ సర్వదా సక్రమంగా వినియోగంకాలేదని కొన్నిచోట్ల దుర్వినియోగమయినదనీ తెలుస్తోంది. దుర్వినియోగమైనట్లు కొంత అనుమానం కొంతపట్టుకోవడం సంభవమయినది. దీనికి కారణం నీరాను నిల్వఉంచే ఏర్పాటు సేకరణ మార్గాలు ప్రధానంగా బండవై ఉండటం, సాంకేతిక పరిజ్ఞానం లేకపోవటం, పరియైన సారథ్యంలేకపోవడమే ఐనాలి."

"మద్యనిషేధం ప్రవేశపెట్టేపూర్వం యీతాటిబెల్లం పరిశ్రమ ప్రధానంగా తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, నెల్లూరు జిల్లాలకు పరిమితమయి ఉండేను. అందువల్ల రాష్ట్రమంతటా తీపికల్లుకు లేదా తాటిబెల్లం తయారుకు చెట్లు గీతకు లైసెన్సు ఇచ్చినంతమాత్రాన నిరుద్యోగులయిన గీత పనివారి సమస్య పరిష్కారం కాజాలదు. సరియైన సాంకేతిక సిబ్బంది సహాయము, పరిపాలనా సంబంధమైన తనఖీ ఏర్పాటు లేకుండా సహకార సంఘాలకు ఈ చెట్లగీత అనుమతి ఇచ్చినందువల్ల అది దుర్వినియోగమౌతోందని, నిర్మాణ కార్యకర్తలు తీవ్రంగా విమర్శించారు. ఆంధ్రరాష్ట్రంలో నేగాక ఇతరచోట్లగూడా యీలోపంవల్ల ప్రభుత్వనీరా విధానాలను ప్రజలు గూడా కంటగించుకుంటున్నారు. అందువల్ల గీత పనివారికి గీత గీసిన నీరాను ఉంచవలెనెల్లా, బెల్లంగాను, పంచదారగాను తయారుచేయవలెనెల్లా, దాన్ని వినుదల చేయవలెనెల్లా ఆనే గీతాంతపాఠ్యాన్ని బోధించాలి. సహకార రిజిస్ట్రారు శాఖవల్ల కొంత కృషి ఈ వ్యవహారంలోజరిగినమాటవాస్తవం. సిబ్బందిపై మాత్రమే దృష్టి లగ్నమైపోయి, వారి దృష్టికి తగిన ఫలితాలు కలుగలేదు. అందువల్ల అభివృద్ధి శాఖ వారి ప్రత్యక్ష అధ్వర్యాన యీ కృషి ప్రత్యేకంగా జరగడం అవసరం."

"ఈ ప్రణాళిక ప్రధానాశయం నీరా ఇతర విధాల దుర్వినియోగం కాకుండా మద్యనిషేధ శ్రేయస్సును రక్షించడం; ప్రజలకు తిను నీరాను, నీరా ద్రవ్యాలను సరఫరాచేసి దానిమూలఏ వారికుండే వైముఖ్యాన్ని తొలగించడమును, గీతగీసేచోట, తీపికల్లు చేరేచోట విమర్శఆయిన పర్యవేక్షణ పెట్టడంవల్ల అది సాధ్యంగాగలదు.

"రెండు మూడు జిల్లాల్లో తాటిబెల్లం పరిశ్రమ కాలకొన్నా అది తయారుచేసే పద్ధతులు చాలా పాత పురాణంగా ఉన్నవి. ఒక్కొక్కచోట మంచి నాణ్యమైన సరుకును వారు తయారు చేస్తున్నారుగాని మొత్తం మీద సరుకు చాలా నాసిరకంగా ఉంటోంది. ఈ ప్రణాళిక ననుసరించి 11 జిల్లాల్లోను జిల్లా కొకచోట ఒక ఉత్పత్తి-శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పాలి. ఒక్కొక్క కేంద్రానికి ఉపాధ్యాయుడు అధ్వర్యంవహిస్తాడు. ప్రతి కేంద్రంలో ఉత్పత్తిభాగం, నీరా భవనవిభాగం రెండు విభాగాలు ఉంటవి. అతని చెప్పు చేతల ప్రకారం 20 మంది అధికారులు ఎన్నుకున్న గీతపనివారు 20 రకాల పరికరాలతో తాటిబెల్లం, పంచదారల, తినుబండారాలు తయారుచేస్తారు. ప్రతి కేంద్రంలో కేంద్రానికి వయ్యిచెట్లు గీస్తారు. తాగడానికి అవసరమయినంత తీపికల్లు గీతపనివారినుంచి ఈ కేంద్రంవారు కొంటారు. ఉత్పత్తి కేంద్రానికి సాధ్యమయినంత దగ్గిర బజారులో నీరాపానీయ భవనాన్ని నెలకొల్పాలి. పరిశుద్ధమయిన వాతావరణాన్ని ఉంచి ఆరోగ్యకరమయిన పద్ధతుల్లో దాన్ని అమ్మి దాన్ని ఆదర్శ కేంద్రంగా ఉంచాలి. ఈ నీరా భవనంలో నే శుద్ధిచేయబడిన తాటిబెల్లం, నీరా సహకారసంఘాలు తయారుచేసిన (విడుదల గాకుండిన) నీరానుంచి తయారైన తినుబండారాలు అమ్మవచ్చు. ఈ నీరా భవనాలను వ్యాపారపద్ధతుల్లో అభివృద్ధిశాఖవారు నిర్వహించాలి. దీనికి వ్యాపార పెట్టుబడికింద ప్రభుత్వం రూ. 30/-వేలు మంజూరు చేయాలి. ఈ నీరా భవనాలకు ఉత్పత్తి కేంద్రంలో ఒక శాఖ ఉంటుంది. నీరా భవనాల స్థాపన నీరా అమ్మకానికేగాక తద్వారా తయారైన పంచదార మున్నగువవి అమ్మడానికి గూడా వీలు ఉంటుంది.

### శిక్షణ

నాల్గు నెలలపాటు ప్రతి కేంద్రంలోను 27 మంది వివిధజిల్లాల సహకార సంఘాల ప్రతినిధులకు తర్ఫీదు ఇవ్వవలసి ఉంటుంది. నీరాసేకరణ, నిలవ, అమ్మకంలో, పరిశుద్ధమైన పంచదార, కలకండ, తినుబండారాలు తయారుచేయడంలో వారికి శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ శిక్షణ ముగిశాక వారు ఆయా జిల్లాల్లో ఆయా సహకార సంఘాలు పెట్టే కేంద్రాలకు అధ్వర్యం వహించడంగాని, తమమాదిరిగా సహకార సంఘాల్లో గీతవారికి తర్ఫీదు ఇవ్వడంగాని జరుగుతుంది. ఆయా అభ్యర్థులు ఒక నెలపాటుమాత్రం తర్ఫీదు పొందాలి. ఆ కాలంలో నెలకు వారికి రు 40/-లు ఇవ్వబడుతుంది. ఈ ప్రణాళికలో ఈ పాటున 300 మంది అభ్యర్థులకు తర్ఫీదు ఇవ్వబడుతుంది. మరి 200 మంది గీత పనివారు ప్రభుత్వం అభివృద్ధిశాఖ కేంద్రాల్లో నిమగ్నమై ఉంటారు.'

'జిల్లా తాటిబెల్లం సారథి ఆదర్శ కేంద్రానికి అనుబంధించి ఉంటూ జిల్లాల్లోని సహకార సంఘాలను మాన్యూ తగిన సలహాలు ఇస్తూ ఉంటాడు. అతను అధ్యాపకుని క్రింద పనిచేయాలి."

### ఉత్పత్తి

శిక్షణ ఇవ్వడానికితోడు 11 లో 8 కేంద్రాల్లో యీ క్రిందివాటిలో ఏదో ఒక ప్రత్యేక పరిశ్రమలో ప్రత్యేకతకు పరిమితం చేయవచ్చు. (1) పంచదార తయారు (2) కలకండ (3) మిఠాయి (4) మర్బత్తు (5) తాటినార పరిశ్రమ. ఒక్కొక్క కేంద్రంలో ఒక్కొక్క దానిలో ప్రావీణ్యాన్ని గణించవచ్చు. ముందుకు సహాయంగా ఉకుటానికి ఆయా కేంద్రాలు ఆయా ప్రత్యేకశాఖలో ప్రత్యేక కృషి చేసి వాటికి వ్యాపారసరళి ఎల్లాఉంటుందో పరిశీలించవచ్చు."

### అభివృద్ధిశాఖలో అంతఃశాఖ

ఈప్రణాళిక అమలుకు అభివృద్ధి శాఖకు అనుబంధించి ప్రత్యేకశాఖను నెలకొల్పాలి. ఖాదీ అభివృద్ధి అధికారి మాదిరిగా గజెటెడ్ ఉద్యోగిని నియమించి అతని అభివృద్ధి కమీషనరు చెప్పుచేతల్లో ఉంచాలి. యీఅధికారికి ఇద్దరు సహాయ ఉద్యోగులు, 2 సీనియర్ తాటిబెల్లం అధ్యాపకులు, 10 సామాన్య అధ్యాపకులు, 2 సీనియరు జిల్లా తాటిబెల్లం సలహాదార్లు, 10 మంది జిల్లా తాటిబెల్లం సలహాదార్లు, ఒక తాటినార పరిశ్రమ అధ్యాపకుడు ఉండాలి.

ఈప్రణాళిక అమలుకు వలసిన సిబ్బందిఅంతా ఇప్పుడు సహకార రిజిస్ట్రారు అధ్వర్యంక్రింద ఉండనే ఉన్నది. ఒక డెప్టీ తాటిబెల్లం వ్యవస్థాపకుడు 9 మంది అధ్యాపకులుఉన్నారు. ఒకరు సమాజనికొసె కేంద్రంలో ఉన్నారు. యీసిబ్బందిని అభివృద్ధి శాఖకు మార్చి, అభివృద్ధి కమీషనరు కింద పనిచేయమనవచ్చు. డెప్టీవ్యవస్థాపకుని అభివృద్ధి ఆఫీసరు గామార్చవచ్చు. ఆఅధ్యాపకులు శిక్షణాలయాలలోని కేంద్ర ప్రభుత్వ శిక్షణాలయంలో తర్ఫీదు పొందినవారే. వారు నాలుగేళ్లుగా యీపనిలో ఉన్నారు. గ్రామపరిస్థితులు, గీతవారిస్థితులు వారికి తెలుసు.

"సహకారశాఖ నుంచి కూర్చి న సిబ్బందికి నూత్నంగా ఒక నెల శిక్షణ ఇప్పించాలి. సాంకేతికంగా జరిగినఅభివృద్ధి ప్రణాళికగూర్చి వారికి చెప్పాలి. వానలులేని రాయలసీమజిల్లాల్లో ఒకచోట ఆగడ్డనెలలో నే తర్ఫీదు కేంద్రాన్ని ప్రారంభించవచ్చు. కడలూరులోని కొందరు అధ్యాపకులను కొనిరావచ్చు. వానలు తక్కువగా ఉన్న చోట వెంటనే పని ప్రారంభించవచ్చు. రాయలసీమ జిల్లాల్లో ఈత చెట్లు తగినన్ని లభించగలవు. తర్వాత తాటచెట్లు అధికంగా ఉన్న సర్కార్లలో జనవరినుంచీ ప్రారంభించ వచ్చు."

"ఇప్పుడు సహకార సంఘాల్లో సభ్యులైన వారికే గీతకు లైసెన్సు అనుమతులివ్వ బడుతున్నవి." ఈ విబంధనల సవరించి, అభివృద్ధిశాఖ క్రింద పనిచేసే ఈ కేంద్రాల్లో పనిచేసే వారికి కూడా అనుమతి ఇప్పించాలి. మద్యనిషేధశాఖ మున్నగు శాఖల సహకారం దీని కెంతో అవసరం."

"నీరా అమ్మకం 52,800 గాలన్లు ఉండవచ్చు. అనగా గాలను, 1 కి పదణాల చొ॥ న రూ 33 వేల కిమ్మతు ఉంటుంది. గాలను 1 కి 5 అణాల చొ॥ గీత పనివారినుంచి నీరా కొనవలసి ఉంటుంది. మిగతాది నీరా భవనాల నిర్వహణ నారవేతకు, తనిఖీ, అద్దె, ప్రచారంకు అవుతుంది. ఇందువల్ల వచ్చే లాభం ఏమున్నా ఉంటే మామూలు రెవెన్యూకు జమకట్టకుండా ఈ ప్రణాళిక వ్యాప్తికిగాను కేటాయించాలి. వ్యాపారానికి రూ 30 వేలు పెట్టుబడి ఉండాలి. పర్చేలు బల్లలున్నగు పరికరాలకు రూ 10 వేలు అవుతుంది. మిగతాది పదార్థాల అమ్మకం వల్ల వనూలు కావచ్చు.

అభివృద్ధి శాఖాధికారి కార్యాలయం కర్నూల్లోనే ఉండాలి. ప్రభుత్వ సంస్థలన్నిటలో వీలైనంతవరకు ఈ నీరానుంచి తయారైన పదార్థాలను వాడాలి. రైలులు ఆగే రైల్వే స్టేషన్లలో నీరా, నీరా పదార్థాలు అమ్మడానికి ఏర్పాట్లు చేయించాలి. కర్నూలు సెక్రెటేరియట్ లో నీరా భవనాన్ని నెలకొల్పాలి.

### శాసనసభ్యుల ప్రణాళికలు

5 లక్షలు పెట్టుబడితో తాటిబెల్లం నుంచి పంచదార ఫ్యాక్టరీ పెట్టాలనీ ఎస్. వెంకటయ్య ఎం. ఎల్. ఏ. గారొక ప్రణాళికను ప్రభుత్వానికి సూచించారు. ఎం. ఆర్. అప్పారావు ఎం. ఎల్. ఏ. గారు నూజివీడులో ఇట్టి పంచదార ఫ్యాక్టరీ పెట్టాలని సూచించారు.

# బొంబాయి స్టోర్సులో అగ్నిప్రమాదం

## ఒకస్త్రీ అహుతి: మరి ముగ్గురికి తీవ్రగాయం

బొంబాయి, ఆగస్టు 28: బొంబాయి సివార్లలోని ఒక రసాయనిక స్టోరులో ఇవాళ సాయంత్రం ఒక అగ్ని ప్రమాదం జరిగి, అమంటలలో చిక్కుకొని ఒకస్త్రీ మరణించింది. మరి ముగ్గురికి తీవ్రమైన గాయాలు తగిలాయి.

మండిపోతున్న ఒకగదిలో చిక్కుకుపోయిన ముగ్గురు స్త్రీలను నిప్పునార్పుదళంవారు ఎలాగో బయటికి తీసుకువచ్చి కాపాడగలిగారు. వారు ఆగదిలో పలికి కిటికీచువ్వలు ఊడదీసి దాని గుండా వళ అభాగ్యులను బయటికి తెచ్చి, తక్షణమే స్థానిక ఆసుపత్రికి చేర్చారు.

స్టోరు గిడ్డంగిలో పనిచేస్తున్న తక్కిన 17 మంది పనివారు అగ్ని ప్రమాదం హెచ్చరిక వినబడంగానే గోడమీద సురక్షిత స్థానానికి పరుగెత్తారు.

అయిదు అగ్నిమాపక యంత్రాలు అరగంటసేపు పోరాడి మంటలను ఆర్పివేశాయి.

మైనము, లక్క మొదలైనటువంటి మంతిగూడిన వస్తువులు నిలవచేసిన ఒక గదిలో మొట్టమొదట ఈ అగ్నిప్రమాదం మొదలయి వుంటుందనీ, మండుతున్న స్టవ్ మూలంగా వాటికి నిప్పు అంటుకొని వుంటుందనీ అగ్నిమాపక దళోద్యోగులు చెప్పారు.

# మిల్లులో కార్మికుని ఉన్మాద చర్య

## మేస్త్రీ మృతి: మరొకనికి ప్రమాదస్థితి

మధుర, ఆగస్టు 28: ఇక్కడి ఒక బట్టలమిల్లు ఆవరణలో యివాళ ఒక దారుణం జరిగింది. కత్తిపోట్లతో ఒక మిల్లు కార్మికుడు మరణించాడు. యింకొకనికి బలమైన గాయాలు తగిలాయి.

కార్మికుల్లో ఒకడు హఠాత్తుగా మొలనుండి కత్తిని తీసుకొని మేస్త్రీమీద విరుచుకుపడి, పొడిచాడు. ఆ పోట్లు ఆయాల్లో తగలడంచేత అతను వెంటనే మరణించాడు. అతని తాచేదారుకు మొఖంమీద బలమైన కోట్లు పడ్డాయి. ఈ ఘాతుకానికి పాల్పడిన ఆ కార్మికుడు ఎక్కడనో పరారీ అయిపోయాడు.

గాయపడ్డ ఆ రెండవ వ్యక్తి స్థితి ప్రమాదకరంగా ఉన్నట్లు చెప్పబడుతున్నది.

మేస్త్రీ శవంపైన ఇవాళ సాయంత్రం పోలీసులు పంచాయతీ విచారణ జరిపి, కత్తిపోట్లతో ఈ మరణం సంభవించినట్లు తేల్చారు.

# క్రీడారంగం

## యూరపియన్ ఆటల పోటీలు

### 800 మీటర్ల పోటీలో జెంట్‌గాలీ విజయం

బెర్న్, ఆగస్టు 28: నిన్న నిక్కడ జరిగిన 800 మీటర్ల పోటీలో, జెంట్‌గాలి (హంగరీ) 1 ని. 47.1 సెకండ్లలో ఆ దూరాన్ని పూర్తిచేసి కొత్త చాంపియన్‌షిప్ రికార్డు నెలకొల్పాడు. ఈ పోటీలో మొదటి ఐదుస్థానాలూ సంపాదించిన ఐదుగురూ, ఇదివరలో బ్రస్సెల్సు పోటీలలో జాపాస్లెట్ (బ్రిటన్, నెలకొల్పిన రికార్డు టైము. 1 ని. 50⅕ సె॥ లను మించిపోయారు. ఐదవవాడుగావచ్చిన మొయిన్స్ (బెల్జియం) 1 ని. 478/10 సె॥ లలో 800 మీటర్లూ పరుగెత్తిగాడు.

మొత్తే 800 మీటర్ల స్త్రీల పోటీలలో నీనా ఓట్కలెంకో 2 నిముషాల 8 8 సెకండ్లలో పరుగెత్తి, విజయం సంపాదించింది.

డయానా లీదర్ (బ్రిటన్) 2 నిముషాల 9.8 సెకండ్లలో ఈ దూరాన్ని పూర్తిచేసింది. ఈమె 5 నిముషాలలోగా మైలుదూరం, పరుగెత్తిదలచిన మొటమొదటి స్త్రీ ఛాంపియన్.

400 మీటర్ల పోటీలో 46.6 సెకండ్లలో పరుగెత్తిన ఇగ్నటీవ్ (రష్యా) కొత్త రికార్డు నెలకొల్పాడు.

ఇక 50 కిలోమీటర్ల పోటీలో పాల్గొన్న రష్యన్‌ఛాంపియన్ యూఖోవ్ 4 గంటల 22 నిముషాల 11.2 సెకండ్లలో పరుగెత్తి రష్యాకు మరొక విజయం చేకూర్చాడు.

నిన్నటి పోటీలలో ప్రకటించిన 8 సువర్ణపతకాలలోను రష్యాకు 7 పతకాలు లభించాయి. ఇవి కాక రష్యాకు 2 రజత పతకాలూ 3 కంచుపతకాలూ కూడా లభించాయి.

థెల్మాహాప్‌కిన్స్ హైజంప్‌లో 5 అడుగుల 6¼ అం॥ లు ఎగిరి కొత్త రికార్డు నెలకొల్పింది. ఇటీవల వాంకువర్ లో జరిగిన ఎంపైర్ పోటీలలో ఈమె 5⅔ అడుగులు దూకింది.

హాప్‌కిన్స్‌ద్వారా బ్రిటన్‌కు యూరపియన్ ఆట పోటీలలో ద్వితీయ పతకం లభించింది.

## పాకిస్తాన్ మిడిల్‌సెక్స్

లండన్, ఆగస్టు 28: ఇక్కడ జరుగుతున్న పాకిస్తాన్ మిడిల్ సెక్స్ క్రికెట్ టెస్టుమాచ్ లో పాకిస్తాన్ మొదటి ఇన్నింగ్సులో 7 వికెట్ల నష్టానికి 303 పరుగులుచేసి ఆట డిక్లేర్ చేసింది. అప్పటికి ఇంకా 20 నిముషాలు వ్యవధివుంది. ఆ 20 నిముషాలలోనూ మిడిల్ సెక్స్‌జట్టు ఒకవికెట్టు నష్టానికి 14 పరుగులు చేసింది. మిడిల్ సెక్స్‌జట్టులో జాక్‌యంగ్ దిట్టంగా బౌల్ చేసి 4 వికెట్లు పడగొట్టాడు.

## హైదరాబాద్ టేబుల్ టెన్నిస్

### ఫైనల్స్‌లో అల్తాఫ్‌అలీ విజయం

హైదరాబాద్, ఆగస్టు 29: సోషల్ వెల్ ఫేర్ అసోసియేషనువారు జరిపిన ఓపెన్ టేబుల్ టెన్నిస్ పోటీలలో నిన్న సాయంకాలం మెన్స్ సింగిల్స్ ఫైనల్సుఆటలో అల్తాఫ్ అలీ ఖుర్షీద్ అలీని 21-18, 16-21, 21-16, 21-19 పాయింట్లతో ఓడించాడు.

మెన్స్ డబుల్స్ ఫైనల్సుఆటలో ఖుర్షీద్ అలీ, రామకృష్ణా కలిసి 21-18, 21-16, 22-20 పాయింట్లతో జయా ఉద్దీన్, యూసఫుద్దీన్‌లను ఓడించారు.

జూనియర్ సింగిల్సు ఫైనల్సులో అజాం 6-21, 21-17, 25-27, 21-8, 21-18 పాయింట్లతో రమేశ్ చంద్‌ని ఓడించాడు.

## బాడ్మింటన్‌లో శిక్షణ

బొంబై, ఆగస్టు 28: బాడ్మింటన్ ఆటలో కొందరు యువకులను ఏరి, వారికి ప్రత్యేకశిక్షణ ఇప్పించడానికి ఆలిండియా బాడ్మింటన్ అసోసియేషన్ వారు నిశ్చయించారు. కలకత్తా, బొంబై, ఢిల్లీ, అమృతసర్ లలో అక్టోబరు ఒకటినుండి మార్చి 31 వరకూ శిక్షణ ఇప్పించడానికి నిర్ణయించబడినది.

## రేపల్లె బాడ్మింటన్

రేపల్లె, ఆగస్టు 26. రేపల్లె తాలూకా బాడ్మింటన్ జూనియర్ డబుల్సు ఫైనల్సు ఆటలో వీరయ్య, వంకట్రావు కలిసి 29-14, 13 29, 29-22 పాయింట్లతో రఘురామయ్యనీ, కృష్ణమూర్తినీ ఓడించారు. ఎగ్జిబిషన్ ఆటలో పి. ప్రసాద్ జట్టు 29-25, 29-26 పాయింట్లతో బలపతిజట్టుని ఓడించింది.

ప్రసాద్ (7 సం॥), నరసింహారావు (12 సం॥) లకు ప్రత్యేక పతకాలు ఇవ్వబడినవి. (స్వ. వి.)

## సెంట్రల్ పాలిటెక్నిక్‌లో విద్యార్థి దొంగతనం

మద్రాసు, ఆగస్టు 28: బ్రాడ్వే యందలి సెంట్రల్ పాలిటెక్నిక్ పాఠశాల విద్యార్థి వేణుగోపాల్ అను 25 యేండ్లవాడు ఆ స్కూలులో ఒక సైకిలును మొన్న 25 వ తేదీని దొంగిలించి దానిని భాగాలుగా విడదీసి తిరువళ్లిక్కేణి మున్నగు ప్రాంతాలలో కొన్నిటిని విక్రయించినాడట. అతను నిన్న యీ సైకిలు భాగాలను కొన్నింటిని మూరుమార్కెటులో అమ్ముతుండగా పోలీసులొవి అరెస్టుచేశారు.

# రేడియో

మంగళవారం, ఆగస్టు 31

### విజయవాడ

ఉ॥ 6-55 వ్యాకరణం 7 తెలుగు వా. 7-15 మద్రాస్ బి వలె 7-30 మద్రాస్ వలె 8 ఆంగ్ల వా.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలలకు 1 ఎ వలె 1-40 హిందీ వా. 1-50 తెలుగు వా. 2 బి వలె 2-15 ఉన్నత పాఠశాలలకు.

సా॥ 4 ప్రాథమిక పాఠశాలలకు 5-30 కంఠంపాటి అక్కాజీరావు-వీణ 6 సంగీతశిక్షణ 6-15 ప్రాంతీయ వా. 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగు వా. 7-15 ద్రోణుడు మా స్త్రీవాపురమునకువచ్చుట. (పురాణం) పమ్మి లక్ష్మీనారాయణ శాస్త్రి 7 30 చౌకజే (హిందీ నాటిక) టి. న్యూస్. 7-45 నేను అడిఉండని అబద్ధము, (ప్రసంగం) మునిమాణిక్యం నరసింహారావు 8 కంఠంపాటిఅక్కాజీరావు-వీణ. 8-30 యూమ 8 వరలక్ష్మి 9 ఆంగ్ల వా. 9-15 సాంస్కృతిక పునరుద్ధరణ. (ఆంగ్లమున చర్చ) పి. ఎస్. టి. రాయి. డా॥ ఎం. జె థామస్ 9.30వాద్యబృందం 10 ప్రసార సమాప్తి.

### మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 వ్యాకరణం 7 వాద్య సమ్మేళనం 7-15 తమిళ వా. 7-30 టి. ఎస్. కృష్ణమూర్తి 8 ఆంగ్ల వా.

మ॥ 12-30 మా॥ పాఠశాల (త) 1 మహిళామండలి 1-30 (త) 1-40 హిందీ వా. 1-50 (త) 2 తమిళ వా. 2-10 బి వలె 2-15 ఉ॥ పాఠశాల (త)

సా॥ 4 ప్రా॥ పాఠశాల (త) 4-30 పాశ్చాత్యసంగీతం 5-30 ఎస్. హనుమంతరావు (ఎక్స్‌ప్రెస్) 6 ఆంగ్ల వా. 6-15 ప్రాంతీయ వా. (త) 6-25 పళని ఆర్. భాగీరథి 7 శ్రీరంగం (త॥ ప్రసంగం) 7-15 తమిళ వా. 7-30 సంధ్యాగానం (త) 7-45 తంజావూరు శివానందంపిళ్ళె-వీణ 9 ఆంగ్ల వా. 9-15 కావ్యపఠనం (గురువాసర్) హిందీ 9-30 శ్రీరంగం కణ్ణన్ 10 వాద్యసంగీతం స్వామినాథపిళ్ళె వేణువు టి. ఎస్. ఆర్. నాదస్వరం 10-30 ప్రసారసమాప్తి.

### మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగు వా॥ 7-15 లలిత గానం 7-30 ఎ వలె

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలలకు 1 దండపాణిదేశిగర్ 1-30 ఆంగ్ల వా॥ 1-40 (త) 1-50 తెలుగు వా॥ 2 పారంగి 2-15 ఉ॥ పాఠశాలలకు.

సా॥ 4 ప్రాథమిక పాఠశాలలకు 4-30 ఎ వలె 6 15 లలితగీతము క. సుందరమ్మ (చాకటిమూల్గులు) 6-30 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగు వా॥ 7-15 గ్రామ॥ కార్యక్రమం 7-30 చర్చ (త) 7-45 ఎ వలె 9-15 నాటిక (త) 9-30 తిరుచిలవె 10 ఎ వలె 10-30 ప్రసారసమాప్తి.

### హైదరాబాదు

ఉ॥ 6-55 సుప్రభాత్ 7 తెలుగు వా॥ 7-15 టి. వి. సుబ్రహ్మణ్య శాస్త్రి 7-45 భజన్ 8 ఆంగ్ల వా॥ 8-15 హిందీ వా॥ 8-30 ఖయాల్.

మ॥ 12 30 (త) 12-50 మరాఠీ వా॥ 1 మహిళాసమాజం రాతుస్సాపేమ (నాటిక)-ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 1-45 నాదస్వరం (త) 1-50 తెలుగు వా॥ 2 విద్యార్థుల కార్యక్రమం.

సా॥ 5-30 ఖయాల్ 5-45 భజన్ 6 మరాఠీ కార్యక్రమం 6-30 జాతీరాయ్ (త) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ 7 తెలుగు వా॥ 7.15 గ్రామసీమ 7 45 కన్నడ వా॥ 8 తెనుగు దినపత్రికలు అభివృద్ధి నొందాలి. (చర్చ) క. నరసింహారావు, ఎ. వి. రాజేశ్వరరావు 8-15 శ్రోతల ఉత్తరాలకు జవాబులు 8 20 గీతావళి ఉపద్రష్ట కృష్ణమూర్తి 8-30 టి. ఎ. సుబ్రహ్మణ్యశాస్త్రి 9 ఆంగ్ల వా॥ 9-15 ఉర్దూ వా॥ 9-30 స్మోకింగ్ (ఆంగ్లమున రూపక కార్యక్రమం) 10 ఖయాల్ 10-30 ప్రసారసమాప్తి.

## కొట్లాటలో జట్కాబండి తోలేవాని మరణం

విశాఖపట్టణము, ఆగస్టు 26: వాల్తేరు రైల్వేస్టేషను ఎదురుగా గుర్రపుబండి తోలే "నీలాపు భూలోకరెడ్డి" అనే అతనికీ సైకిలురిక్షా బండివాళ్ళకూ జరిగినసంఘటనలో భూలోకరెడ్డి తీవ్రగాయాలు తగలటమువల్ల ఆసుపత్రిలో మరణించాడు.

రైల్వే పోలీసులు దర్యాప్తు జరిపి ముగ్గురు రిక్షాబండివాళ్లని అరెస్టు చేశారు.

విజయవాడ, ఆగస్టు 26: 12 వ ఆంధ్రరాష్ట్ర ఈనాం రైతు మహాసభ శ్రీకాకుళం జిల్లా నరసన్నపేటలో సెప్టెంబరు 4 న జరుప నిశ్చయమైనదని వివిధ గ్రామాలనుంచి యీనాం రైతు ప్రతినిధులు పాల్గొనాలనీ శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు ప్రకటిస్తున్నారు.



...ed & Published by S. Sambhu Prasad at the ...a Press, No. 7, Thambu Chetty St, Madras.